# కవుల కథలు

ఉభయభాషాప్రవీణ
సత్యనారాయణచౌదరి

# భాషాపోషక గ్రంథమండలి.

అమృతలూరు, సంపాదకుఁడు.

గుంటూరు మండలము. సత్యనారాయణచౌదరి.

ఆంధ్ర భాషాపోషకు సని యగు బలుపు నా కాంక్షించి యీ గ్రంథ మండలిని వెడలించితిమి. ఏత త్స్థాలమున, అతి విశాలనుగు సంస్కృత వాఙ్మయము పైని పాశ్చాత్య పండితులు వెలయించిన విమర్శనములను ప్రదర్శింతుము. స్మృతులు పురాణములు లోనగు వానిలో విశిష్టములగు వానిని అంద ఱ కవగాహ మగునటులు తేట తెలుఁగున వివరింతుము. సరసములగు సంస్కృ తాంగ్ల గ్రంథములను ఆంధ్ర బాలుర కుపయుక్తమగు వానిని బయలు పఱతుము. బాలికా బాలకులకు సాహ్యాపదు పద్య గద్య కావ్యములను బ్రకటింతుము.

ఆంధ్రలోక పుటాదరాభి మానములను అర్థించు చుంటి మని మనవి.

ప్రస్తుత విద్యాభ్యాస కాలములో సారస్వత విషయమునఁ గృతికర్తల వృత్తాంతములుకూడ నొక భాగముగ బోధింపఁ బడుచుండును. అట్టి వృత్తాంతములను భాషాప్రవేశముతోపాటు - ప్రాథమిక విద్యయందే సామరస్యముగ సంతరించినచో సర్వవిధముల శ్రేయముగ నుండును. ప్రాథమిక విద్యలో భాష సులువుగ బోధింప వలయునన్న కథారూపమగు రచనయే యత్యంతోపయుక్తము. ఇది భావించియే నేను, కవుల వృత్తాంతములను కథారూపముగ నిటులు పేర్కొని యుంటిని.

కేవలము జాతకములుగ పూర్వాపర సందర్భములతోడ రాద్ధాంత సిద్ధాంతములతోడ వన్నెచిన్నెలు పెట్టుచు విమర్శనారూపముగ నున్న కథలు ప్రాథమికవిద్యలో హృద్యములు కావు. మున్ముందు కవిత్వప్రతిష్ఠ - చరిత్రప్రసిద్ధత యించుకంత చవిచూచుచు, తద్రూపముగ నాకవి బ్రహ్మల యితివృత్తము గుఱుతించి మననము చేసికొనుచు భాషాభిరుచి పొందుట శ్రేయస్కరము. ఇటీవలి చరిత్రమార్గములు సత్యములుగ సక్రమముగ నుండుటఁ జేసియు, ప్రాచీనకవుల వరుసలోఁ జేర్పఁదగి యుండుటఁబట్టియు, అర్వాచీనకవులను విశిష్య - భాషాసేవ మిక్కిలిగఁ జేసినవారి నిరువురనుగూడఁ జేర్చి యుంటిని. విసువు కలిగింపని రీతియే గైకొంటిని. ఇంకను మఱికొందఱిని మఱొకతూరి వర్ణింతును.

"భక్తిప్రపత్తులలో అప్రమత్తయై

నిండారు ప్రేముడి నెలకొల్పి

సర్వదా

హృదయశాంతి సేకూర్చఁ జాలి

తానోమిన నోముల పంట యిదిగోనని

అర్భకుని అప్పగించి కాలగర్భమున లీనమైన *

సతీతిలకము

సీతారామకు

సాశ్రుతర్పణము"

సత్యనారాయణ

౧౦-౩-౧౯౩౫

# సూచిక

శ్రీః

# నన్నయభట్టు

మున్ను తెలుఁగుదేశమునఁ గొంతభాగమునకు వేఁగినాడని వ్యవహార ముండెడిది. అదియే నన్నయభట్టునకు జన్మభూమి. ఇతఁడాపస్తంబసూత్రుఁడు; ముద్గలగోత్రుఁడు; వైదికలౌకికవ్యాపారము లెఱింగిన విప్రుఁడు. నాఁటి సంప్రదాయమునుబట్టి నన్నయభట్టు, గీర్వాణవిద్యలో నారితేఱి, పిదప కర్ణాటాంధ్రములయందును మహాపండితుఁడయి భాషాత్రయమందుఁ గవిత్వము సెప్పఁగల ప్రతిభావంతుఁడయ్యెను.

ఉత్తరదేశవాసులగు చాళుక్యులను రాజవంశ్యు లొకప్పుడు తూర్పుదేశమును జయింపఁ గోరి వచ్చి వచ్చి, వేఁగిదేశము నాక్రమించుకొని పరిపాలింప సాగిరి. ఇందు వారికి రాజమహేంద్రవరము రాజధాని. కాలక్రమముగ వారి తెగ యిచ్చోట పాదుకొనిపోయెను. ఆ తెగలోనివాఁడె రాజరాజనరేంద్రుఁడను మహీపతి. ఇతఁడశేష శత్రురాజులను నిరవశేషముగ జయించి, నిర్విచారుఁడయి విద్యావిషయములందె కాలము గడుపసాగెను. సంస్కృతాంధ్రకర్ణాటభాషలలో గొప్ప నేర్పుకలిగిన మహాపండితులను మహాకవులను - ఇమ్మహారాజు పోషింపఁజొచ్చెను.

అట్టి విద్యాపక్షపాతియగు విభుఁడు మన నన్నయభట్టున కాశ్రయ మిచ్చెను. నాఁటినుండి యాతని యాస్థానమందలి కవులలోను పండితులలోను నన్నయభట్టే యగ్రగణ్యుఁ

డాయెను. రసజ్ఞశేఖరులగు రాజులున్నపుడే గదా కవిరాజుల ప్రతిభావిశేషములు రాణింపఁ గలిగియుండుట! సకలాగమ పురాణేతిహాసాదులను-అనారతము వినియుఁ దనివి తీరక రాజ రాజొకనాఁడు విద్వజ్జనుల మ్రోల 'భారతామ్నాయమును దెలుఁగున భాషాంతరీకరింపఁగలవారెవ్వర'ని ప్రశ్నించెను. అట్టి మహాకార్యమునకు నన్నయభట్టే యర్హుఁడని యందలి విద్వ ద్బృందము-ఐకకంఠ్యముగఁ బలికెను. తత్క్షణమ యాతేఁడు నన్నయను సత్కరించి కావ్యరచనకుఁ బ్రోత్సాహమొసఁగి మిక్కిలియు నాదరించెను.

ఆరోజులలోఁ దెలుఁగునాటఁ దెలుఁగుబాస కంతగాఁ బోషణము లేదు. గొప్పపండితులు పెక్కురు సంస్కృతభాష దైవభాష యని మురిసిపోవుచు, తెలుఁగుబాస నీసడించుచుఁ దెలుఁగునఁ బాండిత్యము కలిగియు తెలుఁగు కయితమాటయే తలపెట్టక మాతృభాషాద్రోహు లగుచుండెడివారు. నాఁటి పౌరాణికులు సంస్కృతభారతమును దేటతెల్లముగఁ దెలుఁగున విప్పిచెప్పలేక భారతార్థమును దప్పులు దుప్పలుగఁ జెప్పెడి వారు. మఱియుఁ దెలుఁగు కైతవంకకు సంస్కృతపండితులు పోరాదను నపవాదము కూఁడ గలదు. అట్టిలోపముల నన్నింటిని రూపుమాపి 'ఆంధ్రమహాభారతమును' రచింపసాగి, ఆంధ్ర భాషాయోషకు వన్నెచిన్నెలు కూర్చినవారిలో నన్నయభట్ట కవి యెన్నఁదగ్గవాఁడు. ఈతని నాఁటినుండియే తెలుఁగు కవిత్వ

మున్న నాదరణ మెండయినది. నేఁటికిఁ గానుపించు - ఆంధ్ర వాఙ్మయములో నీతని మహాభారతమే యాదిగ్రంథముగఁ జెప్పనొప్పును. పాండితీవిశేషమును బట్టి యానాఁడీతనికి 'వాగనుశాసనుఁడ'ని బిరుదము కలిగె. గొప్పపండితుఁడగు నారాయణభట్టను నాతఁడీతనికి సహాధ్యాయుఁడు. ఇరువురకును మిక్కిలి మైత్త్రి కలదు. ఆంధ్రభారతరచనలో నీతఁడు మనకవికి మిక్కిలిగఁ దోడ్పడియుండెను.

వేములవాడ భీమకవి నన్నయకు సమకాలికుఁ డందురు. ఆతఁడు రచించిన ఛందశ్శాస్త్రము నన్నయ ప్రతిభావిశేషముచే నణఁగిపోయెను. అద్దాన శాపానుగ్రహదక్షుఁడగు భీమకవికి నన్నయమీఁద ద్వేష ముదయించెను. ఒకనాఁడు నన్నయ, యింట లేనితఱి భీమన యాయింటి కేఁగి 'నీభర్త యేమిచేయుచున్నాఁడమ్మా' యని యాతని భార్య నడిగెను. విద్యావిషయములందుఁ గుశాగ్రబుద్ధి కల యామెయు 'ఆరణ్యపర్వము వ్రాయుచున్నార'ని సమాధాన మొసఁగెను. అంతట భీమన, 'నన్నయ యింకను నరణ్యమందే యున్నాఁడా! సరి, యాతఁ డెప్పుడట్లే యుండుఁగాక' యని శపించిపోయెను. ఆశాపము వలన నన్నయభట్టు మతిభ్రమణము చెంది తరువాతి భారత భాగమును రచింపలేక పోయెను. అటనుండి తక్కిన భాగములను మఱి యిరువురు కవులు కొన్ని యేండ్లకుఁ బిదపఁ బూరించిరి.

ఇట్టి వదంతినిబట్టియే నేఁటికిని బెక్కుగు పౌరాణికు లారణ్య పర్వమును విడనాడి తక్కినభాగమును జదివెదరు.

ఎచ్చోటనుండి యెంతటి పండితులు విచ్చేసినను నన్నయ భట్టుతో మున్ముందు ముచ్చటింపనిదే రాజరాజు సందర్శనము సఫలమయ్యెడిది గాదు. తెలుఁగువారిలో మహాభారతమున కంత మన్నన కలుగుటలో నన్నయభట్టకవియే ప్రధానకారణము. తరువాతి కవులెల్లరు తమతమ కబ్బములలో మున్ముందు నన్నయను భక్తిప్రపత్తులతో స్తుతింపసాగిరి. నాఁటికేగాదు - నేఁటికిని పౌరాణికులు పురాణగ్రంథముగ నన్నయ భారతమును ప్రేమింతురు. ఆంధ్రవైయాకరణు లాద్యగ్రంథముగ దీనినే ప్రమాణ మిత్తురు. తెలుఁగు కవులు దీనినే యాదర్శక గ్రంథముగ నెన్నుకొందురు.

వ్రాయింపవలెనని సంకల్పముండుటంజేసి రాజరాజ మహీపతియు, రచించి ధన్యుఁడగుటంజేసి నన్నయకవియుఁ దెలుఁగువాణి యుండునందాఁక నెల్లవారికి సంస్మరణీయులు. తెలుఁగుభారతము రుచితెలియని పల్లెటూరు తెలుఁగుసీమలో లేదనవచ్చును. ఆంధ్రవాఙ్మయమున - ఆంధ్రభారతము - ఆద్యగ్రంథమను భాగ్యము దక్కించుకొఁగల నన్నయభట్ట సుకవీ, నీకు జోహారులు !! నిన్ను స్మరింప నేరని తెలుఁగు కవియు ; నిన్నుఁ గొండాడి యెఱుంగని తెలుఁగువాణియుఁ దెలుఁగుసీమకు వన్నె తేఁజాలవనుట పొగడ్త కానేరదు.

# భీమకవి

గోదావరీమండలమున వేములవాడ యను గ్రామ మొండు కలదు. అందొక బ్రాహ్మణదంపతులకు లేకలేక చిర కాలమున కొక్క యాఁడుశిశువు కలిగెను. ఆనాఁటికానాఁ డల్లారుముద్దుగా నాబిడ్డ పెరుగుచుఁ గ్రమముగ యుక్తవయ స్కురాలయ్యెను.

ఆపెను, విద్యాబుద్ధులతో వెలయు విప్రకుమారున కొకని కిచ్చి వివాహ మొనర్చిరి. కాని, యత్తవారింటి కరుగు ప్రాయము వచ్చుతఱిని పాపమామె భర్త పరలోకమున కరి గెను. ఆమె తల్లిదండ్రి లాగారాబు బిడ్డకుఁ గలిగిన విషమావ స్థకు నెంతయు వగచి వగచి కూఁతును బుజ్జగించి తమయింటనే యుంచుకొని పోషింపసాగిరి.

ఒకప్పుడు శివరాత్రినాఁడా యూరి బ్రాహ్మణకాంత లటకు దాపుగ నున్న దాక్షారామమునకుఁ బోవఁ బయన మయిరి. దాక్షారామమందు భీమనాయకస్వామియను దైవము కలఁడు. శివరాత్రి కచ్చోట గొప్ప యుత్సవములు జరుగును. వివిధ ప్రాంతములనుండియు భక్తబృందము మట కానాఁడు భక్తి శ్రద్ధలతో వచ్చుచుండును. మన బ్రాహ్మణతనూజయుఁ దల్లిదండ్రుల యానతి గైకొని, యా కాంతలతో పాటు దాక్షారామము చేరెను.

అట నా బ్రాహ్మణయువతు లందఱు సప్తగోదావరమున స్నానమాడి భీమనాయకుని సందర్శించి యథోచితముగ మ్రొక్కుకొన సాగిరి. అదిచూచి యామెయు, నూఱకుండనేల యని దిటవు చేసికొని స్వామిదెసకుఁ దిరిగి యిటులు మ్రొక్కుకొనెను:—'స్వామీ, నినుఁబోలిన పుత్త్రుఁడు నాకుఁ బుట్టెనేని పుట్టెడునీరు దీపారాధనము సలిపి నాలుగు పుట్ల యినుక నైవేద్య మొసంగెదను'

పిదప నెచ్చటివారచ్చటికిఁ జనిరి. ఆమఱునాఁటి రేయి యీశ్వరుఁ డాబ్రాహ్మణపుత్త్రికకుఁ గలలోఁ గానుపించి—'యువతీ, పుత్త్రుఁడు కావలయునని మ్రొక్కితివి. అట్లే కలుగును; నాపేరాతనికిం బెట్టుము'ని చెప్పి యంతర్ధాన మందెను. ఆమెయు విస్మితయై యాయుదంత మేరికిని సిగ్గుపాటునఁ జెప్పదయ్యె.

క్రమముగ గర్భవతియై కాలము గడువను సాటివారి కెల్లరకు సందేహింపఁ గారణమయ్యెను. తోడ్తో నెల్లరా బ్రాహ్మణగృహమును వెలివైచిరి. తనయ నిర్దోష యని తండ్రి యెఱింగి యెవ్వరేమన్నను లెక్కసేయక యాపెం గాపాడుచుండెను. ఇటులుండ నొక్కనాఁడు శుభసమయమునం దాపెకు నమితతేజశ్శాలి యగు నాత్మజుఁ డావిర్భవించెను. ఆతనికి భీమేశ్వరుండని నామకరణ మొనర్చిరి.

ఆతఁడు బాల్యమునఁ దోడివారితో నాటలాడుతఱిని గడు చులుకుగా నుండుటఁజేసి కొందఱుబాలు రసూయపడి యాతని లోపము లెన్నసాగిరి. ఒకప్పు డొక్కఁడు, తండ్రిలేని వానితో నుసకేలరా యంచుఁ దోడిబాలురతో భీమననుగూర్చి పరిహాసముగఁ బలికెను. భీమన చిన్నపుచ్చుకొని తోడ్తోఁ దల్లికడకుం జని — 'అమ్మా, మా తండ్రి యేడీ! అందఱు నన్నిటు లపహసింతురేల! నిజము వివరింతువా లేదా!' యని సాటోపముగఁ బలికెను. ఆమెయు నాతని దుడుకుతనమునకు జంకి, 'నాయనా, దాక్షారామపు కోవెలలోని శిలయే మీయయ్య. అటకుఁబోయి నీవృత్తాంత మడుగుము. చక్కఁగాఁ దెలిసికోఁగలవు' అని ప్రత్యుత్తర మొసఁగెను.

తత్క్షణమె యాభీమన దాక్షారామమునకుఁ దరలి కోవెలలోఁ జేరి యిటులు గద్దించి యడిగెను—'ఓయీ, నీవు నాతండ్రివఁట. బాలురెల్లరు ననుఁజూచి పరిహసింతురేల! నీవుండియు నూఱకుందువేమి!' అని. కాని ప్రత్యుత్తరమెద్దియు వినరాదు. అంత నెంతయు నాతఁడు మండిపడి యొకఱాయి పెట్టికి కొనివచ్చి, 'మాట్లాడవేని నీతల వ్రయ్యలు చేసెద నిదిగో'నని పలుకుచుండఁగనె భగవంతుఁడు ప్రత్యక్షమయ్యెను.

స్వామి—బాలుఁడా, నేనే నీకుఁదండ్రిని. ఇదియంతయు నంద ఱకు నిఁకను దెలియును బొమ్ము.

బాలుఁడు- స్వామీ, నేను నీకుఁ బుత్రుండ నయినచో నేనాడి
నది యాటయుఁ బాడినది పాటయు నగునటులు వర
మిమ్ము.

అనుడు పరమేశ్వరుఁడు నవ్వి వల్లెయని వరంబొసంగి యంతర్హితుండయ్యె. బాలుఁడును బరమానందమున నిల్లు చేరెను. ఆయుదంతమును వినిన యాతని జనని సంతసమునకు మితియు మేరయు లేదు.

ఒకప్పు డాయూర నొక్క సంపన్నుని యింట బ్రాహ్మణ సంతర్పణ మత్యద్భుతముగ జరుగుచుండెను. వెలివెట్టిరి గదా యని భీమనను బిలువరయిరి. ఆతఁడును వగచి యాయింటి కరిగి వాకిటఁ గూరుచుండెను. ఇది యెఱింగి లోనివారు కవాటమును గట్టిగ మూసివైచిరి. అవిచ్ఛిన్నముగ వడ్డనలు జరుగుచున్నవి. వారికి భీమన తన మహత్త్వము చూపఁదలఁచి, 'అప్పాలు కప్పలు—అన్నము సున్నము కావలె' ననుచుఁ బాట పాడెను. అట్టులే లోపలఁ గప్పలు సున్నము సిద్ధమయ్యె. అందఱును ముందు వెఱఁగందిరి. భీమన మహిమయే దీనికిఁ గారణమని యెల్లరకుఁ దోఁచినది. తోడనె వానిం దోడికొని పోయి యెంతయు నాతనిఁ బ్రార్థించి పూజించిరి. యథాపూర్వముగ నాహారము దృగ్గోచరమయ్యె.

నాఁడు మొదలు భీమన కగౌరవ మన్నది లేదు. కవులందఱు మహాకవియని గౌరవించిరి. భక్తులెల్లరు పరమేశ్వర వరప్రసాది యని సంభావించిరి. ప్రజలెల్లరు శాపానుగ్రహ దక్షుఁడని విశ్వసించిరి. ఈతఁడు సర్వవిషయములందును నేర్పరి. రెండర్థములు గల కావ్యమును రచించెను. ఛందోవిషయిక మగు గ్రంథమును వ్రాసెను. కవిత్వసామ్రాజ్యమున పట్టభద్రుఁడగు నీతఁడు రారాజులను సయితము గడగడ వడఁకించి వైచినాఁడు. నందిని పందిగను పందిని నందిగను జేయఁగా వఱంతి యగు నుద్దండకవి.

# పోతనామాత్యుఁడు

సుప్రసిద్ధమగు నైజామురాజ్యమం దోరుగల్లను పట్టణ మొక్కటి కలదు. మున్నయ్యది యాంధ్రసామ్రాజ్యమునకు రాజధానియై వెలసినది. అందు బమ్మెరవారను నియోగి బ్రాహ్మణులలో 'కేతన-లక్కమ' యను దంపతులకు పోతన యను పుత్రుఁడు పుట్టెను.

అతఁడా గర్భదరిద్రుఁడు. కావుననే చిన్ననాఁ డాతఁడు గ్రామోపకంఠమునఁ బసువులను మేపుకొనుచుండెడివాఁడు. కాని, దైవమన్నను పెద్దలన్నను భక్తి చూపుచుండును. ఒకనాఁ డాతనికిఁ బూర్వజన్మపుణ్యమున ఊరి వెలుపల చిదానందుఁడను యోగి కానుపించి, యాతని ప్రవర్తనము మెచ్చుకొని, రామ మంత్ర ముపదేశించి తన త్రోవను బోయెను.

నాఁటినుండి యాతని కనర్గళమగు కవితాధార యేరు పడియెను. అంతదనుక నాతఁడెవ్వరియొద్దను విద్య నభ్యసించి యెఱుఁగఁడు. ఆకస్మికముగ రామచంద్రుని యనుగ్రహమున ఆవశ్యకమగు విద్య లభించినది. తోడనె యాతనికి సంస్కృత భాగవతము తెలుఁగింప వలయునని యభిలాషము పుట్టెను. పుట్టినదే తడవుగ మృదుమధురమగు కవిత్వధోరణిలో ఆంధ్ర భాగవతము రచింపసాగెను.

ఇది యెఱింగి కర్ణాటకరాజొకండు తన కాగ్రంథము నంకిత మిమ్మని కబురు పంపెను. అందఱివలె గ్రంథము లిత రుల కొసంగి ధనము కూడఁబెట్టవలయునను తలంపు లేకుండు టచే పోతన యాతని మాటలకు సమ్మతింపఁడయ్యె. ఆతఁడును మండిపడి పోతనను బట్టి తెండని భటులను బంపెను. అప్పటి కాకవీశ్వరుఁడు తృతీయస్కంధమును వ్రాయుచుండెను. అంత శ్రీహరి పోతనమీఁది వాత్సల్యముతో శ్వేతవరాహరూప మెత్తి, రాజభటుల నెల్లరను జెల్లాచెదరుగఁ దఱిమి వైచెను.

ఎట్టెట్టులో గ్రంథ మంతయు వ్రాయుట ముగిసినది. ఈవిషయ మందఱకుఁ గ్రమక్రమముగఁ దెలిసిపోయె. శ్రీనా థుఁడను కవిసార్వభౌముఁడు పోతనకు బావమఱఁది. ఆతఁడు కూడ నిది యెఱింగి యాగ్రంథము నేరాజునకైన నిప్పించి పోతనను భాగ్యవంతునిగాఁ జేయ నుత్సహించి, యొకనాఁడు సవారి నెక్కి యోరుగంటికి వచ్చుచుండెను.

ఆసమయమున పోతన, కొడుకుచేఁ బొలము దున్నించు చుండెను. అది శ్రీనాథుఁడు చూచి, తనమహత్త్వ మాతనికిఁ జూపఁదలంచి, సవారి మోయువారిలో ముందటివారిని దొలఁ గుఁడని చెప్పెను. వారును దొలంగిరి. సవారి యెప్పటియట్ల పోవుచుండెను. ఇది పోతనకొడుకు చూచి యబ్బుర మందెను. పోతనయు వెంటనె నాఁగటికిఁ గట్టిన యొకదున్నను విడిపిం

చెను. ఇది శ్రీనాథుఁడు కాంచి, సవారి మోయుచున్న తక్కిన వారిని గూడఁ దొలఁగునటులు చేసెను. మోయువారు లేకయే సవారి సాగిపోవుచుండెను. ఇటు, పోతనయు రెండవదున్నను విడిపించియే పొలము దున్నించుచుండెను.

అంతట శ్రీనాథుఁడు సవారినుండి దిగి బావమఱఁది యొద్దకు వచ్చెను. కుశలప్రశ్నములు జరిగినవెనుక వారంద ఱిల్లు చేరిరి. రాజాధి రాజభోగములు నిచ్చలు ననుభవించు శ్రీనాథునకు, నాతని పరివారమునకు భోజనం బెట్టు కూర్తునా యని నిఱుపేద యగు పోతన యాలోచించుచుండెను. ఇంతలో సరస్వతి ప్రసన్నయై సర్వపదార్థములు సమకూర్చి యాబలగ మున కెందును లోటుపాటులు కాకుండునటులు కావించెను.

భుజించిన వెనుక నందఱును గూరుచుండిరి. ఏదీ చూత మని శ్రీనాథుఁడు భాగవతమును దెప్పించెను. అచ్చటచ్చటఁ బరిశీలించెను. అందు గజేంద్రమోక్షణఘట్టము బాగుగఁ జూచి శ్రీనాథుఁడు పోతనతో నిట్టులనియె—'బావా, శ్రీహరి మకరి నుండి కరిరాజును గావఁగోరి వైకుంఠమునుండి యూఁటక వచ్చి నటులు వ్రాసితివేమి? మకరిని శిక్షించి, కరిని రక్షింపవలయు నన్నఁ బరికరము లెవ్వియు నవసర ముండదా! వేడుక చూడ వచ్చెనా!'.

నావిని పోతన, యాయాక్షేపము మనసునఁ బెట్టుకొని యప్పటికి యూఱకుండెను. ఆనాఁడు గడచినది. మఱునాఁడు శ్రీనాథుఁడు భోజనమునకుఁ గూరుచుండుతఱిని, పోతన శ్రీనాథుని తనయుని దాఁచియుంచి, పెద్దఱాతిం దెచ్చి దొడ్డిబావిలోఁ బడవైచి వేగముగా వచ్చి బావా, నీకొడుకు నూతిలోఁ బడినాఁడని శ్రీనాథునితోఁ జెప్పెను. ఆతఁడు గుండెలు కొట్టుకొనుచు నెంగిలిచేతితో లేచి యేమియుఁ దోఁచక బావి యొద్దకుఁ బరుగున వచ్చి తొంగితొంగి చూచుచు ఆక్రందన మొనర్చుచుండెను.

పోతన యాతని వెనుకవైపున నిలిచి యిటులు పరిహసించెను—'బావా, యిదేమి యిట్లు వచ్చితివి? నూతిలోని పిల్లవాని నెట్లు తీయఁదలఁచితివి! నిచ్చెన యేది! త్రాడేది? సామగ్రి యేది! ఊఱక వేడుకకై వచ్చితివా యేమి!—అని మఱల నిటులు పలికెను—'తెలిసినదా! పుత్త్రవాత్సల్యమున నెద్దియుఁ దోఁచక, పరికరములమాట మఱచి, నీవేతీరుగఁ బరుగిడి వచ్చితివో యాతీరుగనే శ్రీహరియు గజేంద్రునిఁ గావఁ దలంచి తొందఱగా వచ్చియుండును'. అది విని శ్రీనాథుఁ డప్పట్టున నేమియు ననక మౌనము పూనె.

ఇట్టి యద్భుతవిశేషము లనేకములు పోతనయం దింకను గలవు. అక్షరాస్యులగు ఆంధ్రులలో పోతనభాగవత మెఱుం

గని వారుండనేరరు. తెలుఁగునాఁట నయ్యది చొచ్చి చూడని పల్లెటూరు చూపట్టదు. పోతన—మహాకవి; మహాభక్తుఁడు; నిరీహుఁడు. రాజులను నమ్మి, వారిపంచఁబడి కాకిపోలెఁ బొట్ట పోసికొనుటకన్న—దైవమును నమ్మి యాతనియందె భార ముంచి జీవయాత్ర గడపుట శ్రేయమని పోతన సిద్ధాంతము. ఇంతటి భక్తుఁడయి, కవిత్వతత్త్వ మిట్టిదని గుఱుతించిన మహాకవీశ్వరుఁ డీదేశమున మఱెవ్వఁడును లేఁడు. ఆచంద్రార్కముగ నాతని దివ్యయశము దశదిశల వ్యాపించి వెలయుచుండును.

# శ్రీనాథుఁడు

నెల్లూరిసీమ ప్రాంతమున పాకనాటి నియోగి బ్రాహ్మణులు ప్రసిద్ధులు కలరు. వారిలో శ్రీనాథుఁడను కవి జన్మించెను. ఈతని తండ్రియుఁ దాతయుఁ బేరుగన్న విద్వాంసులు; కవులుఁగూడ. వంశపరంపరాగతమగు విద్యాఫలమును బొందిన వారిలో శ్రీనాథుఁ డొకముఖ్యుఁడు.

ఆనాఁడందఱు, తిక్కన-తిమ్మన లోనగు పేరులు బిడ్డలకుఁ బెట్టుచుండ, శ్రీనాథున కాపేరు పెట్టుటలోనే తద్వంశమందలి నాగరకత ద్యోతక మగుచున్నది. శిష్టసంప్రదాయము లోనివాఁడు కావున శైశవమునుండియు శ్రీనాథుఁడు విద్యలయందు మెలఁగుచుఁ గాలక్రమమున, వేదవేదాంగములు—కావ్యనాటకాలంకారములు లెస్సగ నభ్యసింప సాగెను. ఈతఁడు బ్రాహ్మదత్తవరప్రసాదుఁడు. ఈశ్వరార్చనాపరుఁడు. పేరికి శ్రీ-నాథుఁడయ్యు, 'దైవతంబులలో సుధాధామమౌళి-మేలు'-అన్నట్టి శైవమంత్రోపాసకుఁడు.

లేఁబ్రాయమందె యీతఁడు సంస్కృతాంధ్రముల యెడఁ బాండిత్య మలవఱచికొని గ్రంథరచనకుఁ గడంగెను. కవిత్వధోరణియందును పాండిత్యపరీక్షమందును—ఎదురువడ్డ పండితుల నెల్లరను 'ఛీ' కొనెడివాఁడు. ఆనాఁడీతని పేరుప్రతిష్ఠల నెఱుంగని తెలుఁగుతేఁడెవ్వఁడు లేఁడు. భారతకవులయెడఁ

దెలుఁగువారి కెంత గౌరవభావ మున్నదో యీతని యెడఁగూడ నంతగాఁ గలదు.

రాజాభ్యుదయము నాకాంక్షించు రాజేటులు జైత్ర యాత్రలు సలుపుచు శౌర్యాదికము సూపుచు విజయలక్ష్మిచే వరింపఁబడుచుండునో, యట్టులే యీకవిరాజు దేశమంతయుఁ దిరిగి యశేషపండితులను జయించి, విశేషపారితోషికము లంది ప్రఖ్యాతి పొందెను. కొండవీటిరాజ్యాధిపతి యగు కోమటి వేముఁ డీతనిఁ దనయాస్థానమున విద్యాధికారిగా నేర్పఱచు కొనెను. పోతనాదులు నిత్యదరిద్రులై రాజులకు దూరులై యేకాంతవాసము చేయుచుండ నీతఁడు తోట్లతోలుత సంపద లలోఁ దూఁగుచుఁ జక్రవర్తులసన్నిధినిఁ గాలము పుచ్చుచు నిర్విచారముగ భాషాయోషకుఁ బ్రాపు కలిగించినాఁడు.

ఒకప్పుడు శ్రీనాథుఁడు రాయలను నొకతేని యాస్థాన మున కరిగెను. అట్టితటి నారాజు 'గృహరాజుమేడ' యను సౌధ విశేషమును గట్టించు యత్నమునందుండెను. అది యెటింగి శ్రీనాథుఁ డట్టిసౌధము తన యేలిక యగు కోమటివేమారెడ్డికి మాత్రమే యుండవలయునుగాని తక్కినవారికిఁ దగదని భావించెను. భావించి రాయలతో 'రాజా, యట్టిసౌధము మాప్రభు వగు వేమారెడ్డికిఁ గలదు. అద్దానిఁ గాంచి మీరును గట్టింప వచ్చు' నని వచించెను. అయ్యది యపూర్వమని యంతదనుక

తలంచిన రాయలు, వేమారెడ్డికి నున్నచోఁ దాను గట్టింపవల సీన పని లేదని పల్కెను.

అయినను తన్నిర్మాణవిధానము నారసి రండని భృత్యులు కొందఱకు రాయ లాజ్ఞ యొసంగెను. వెంటనే శ్రీనాథుఁడును దన భృత్యులను రావించి తమప్రభువుతో నీయుదంతము చెప్పుఁడనియుఁ దన మాటకు లోటు రానీక త్వరలో నా మేడను సిద్ధపఱుపవలెననియుఁ జెప్పి పంపెను.

అట వేమారెడ్డి శ్రీనాథుని సందేశమును ముందుగా విని మేడను గట్టింపఁగలనా యని దిగులు పడసాగెను. అంతలో నాతని యిలువేల్పు స్వప్నమునఁ గానుపించి 'రాజా, కొండ వీటి యందున్న పోతరాజు గుడియెదుట ముసలితుమ్మచెట్టొకటి కలదు; దానిని జేర్పించి స్తంభముగా నేర్పఱచినచో మేడ సిద్ధమగు' నని చెప్పెను. వేమారెడ్డియు నట్లులే చెట్టును గొట్టి తెప్పించి మేడను సిద్ధము చేసెను. ఇంతలో రాయల భృత్యు లరుదెంచి 'గృహరాజుమేడను' జూడ వచ్చితి మనిరి. వల్లె యని వేమారెడ్డియు వారిని గారవించి మేడ నంతయుఁ జూపించి బహుమతుల నిప్పించి పంపి వైచెను. అట శ్రీనాథుఁ డును దనమాట నెగ్గినదని మిక్కిలిగ సంతసించి, రాయల యాస్థానమునఁ గవిత్వపటుత్వమును ప్రస్ఫుటపఱచెను. రాయ లు నాతనికిఁ బారితోషికము లొసంగి మిక్కిలిగా మన్నించెను.

మఱొకప్పుడీ శ్రీనాథుఁడు కర్ణాటప్రభునాస్థానమున కేగెను. క్రొత్తకవియో, పండితుఁడో యరుదెంచినపుడు వారిని బరీక్షించుటకయి యాస్థానములందు విద్వాంసులను గొందఱ నేర్పఱచుకొనియుండుట మన పూర్వరాజుల సంప్రదాయము. అట్టులే కర్ణాటాధీశుఁడు డిండిమభట్టారకుఁడను ఉద్దండపండితు నొకనిఁ బోషించుచుండెను. ఇఁకనేమి! శ్రీనాథునకు డిండిమ భట్టారకునకు శాస్త్రచర్చయందు సాహితీవిమర్శమునందు ఉద్భటమగు వివాదము ప్రాసఁగెను. పండితమండలి యుభయ పార్శ్వములందు బలిసి కూరుచుండె. మంత్రులు-సామంతులు ప్రభువు-పరివారము తదేకదీక్షగ నిరీక్షింపసాగిరి. తుట్టతుదకు విజయలక్ష్మి శ్రీనాథునే వరించెను.

తోడ్తో శ్రీనాథుఁ డెల్లవారియెదుట ఆపండితుని విజయ డిండిమము పగులఁగొట్టించివైచెను. అంత నాకర్ణాటప్రభుండు తన ముత్యాలశాలయందు గొప్ప పండితసమావేశము కావించి, శ్రీనాథకవిరాజున కానాఁటి బంగారునాణెములతో స్వర్ణస్నానో త్సవము సమకూర్చెను. ఆయుత్సవసమయమందె డిండిమభట్టా రకుని కవిసార్వభౌమబిరుద మీతనికి సంక్రమించెను. అట్టి సార్వభౌమబిరుదము— కనకాభిషేకసత్కారము నాఁటికి నేఁటికి నాతీరుగ నెవ్వారికిని లభించినదికాదు.

ఆనాఁడు పండితులు నిరంకుశచర్యులయి విద్యాప్రియులగు రాజులమ్రోల గౌరవభాజులయి, రాణింతు రనుటకు శ్రీనాథకవి చరిత్రమే తార్కాణము. పలుకుఁదేనియలతో నెందతెందలకో ప్రభువులకు- ప్రభుమంత్రులకు- ఆమెతలు వెట్టి కీర్తిధనములను లెస్సగ నార్జించిన కవిసార్వభౌమా, శ్రీనాథా, యన్నింట నీవు ధన్యుండవు. నీప్రాపునఁ దెలుఁగు వాణియు ధన్యురాలుగదా!

# శ్రీకృష్ణదేవరాయలు

తుంగభద్రానదీతీరమున విద్యానగరమను నామాంతరముతో విజయనగరమను పట్టణము కలదు. దానినే యిపుడు హాంపీవిజయనగర మందురు. అందుఁ బూర్వము చంద్రవంశపు రాజు లుండెడివారు. వారిలో నరసింహదేవరాయలను రాజన్యునకు ద్వితీయభార్య యగు నాగమాంబయందు శ్రీకృష్ణదేవరాయలను పుత్త్రుఁ డుద్భవించెను.

ఆతనికి 'తిమ్మరుసు'—అనునతఁడు మంత్రి. శ్రీకృష్ణదేవరాయలన్న నతని కత్యంతప్రేమము. ఆతఁడే యాతనికి రాజనీతివిద్యాగురువు. బాలకుని నిశితమతికి, మంత్రియేగాదు- ఎల్లవారును సంతసించుచుండిరి. రాయల సవతితల్లికి మాత్ర మసూయ మెండు కాసాగె. దాన నామె యాబాలకు నెద్దియే నుపాయమునఁ జంపుటకుఁ జూచుచుండెను. కాని, సర్వదా సర్వవిషయములం దాతనికి తిమ్మరుసే రక్షకుఁడయ్యె.

నరసింహదేవరాయల కవసానదశ సమీపించెను. ఒడలంతయు నీరువ్యాధి క్రమ్ముకొనియె. అంత నాతఁడు తనరాజ్యమునకు భవిష్యత్పాలకు నేర్పఱుపఁజూచి, కొమరులను రావించి వారితో నిటులనియె—'బిడ్డలారా, నేనిఁక గతింతును. మీలో నొకరు రాజ్యాధికారి కావలయును. అందుల కొక పరీక్ష కలదు. ఏమందురా—నావ్రేల నున్న యీయుంగరము

చూడుఁడు. ఎట్టులైనఁ గానిండు — దీనిని గైకొన్నవాఁడే భవిష్యద్రాజ్యాధికారి యగును —' అని.

నానిని పెద్దబిడ్డయగు వీరనరసింహుఁడు తండ్రివ్రేలు పరీక్షించె. అది వ్యాధిచే నుబికియుండుటఁజేసి యుంగరము బిగువుగా నుండెను. ఏమియుఁ దోఁచక యట్టె పైకిఁ జూడసాగెను. ఇంతలోఁ గృష్ణదేవరాయలు ముందునకు వచ్చెను. తండ్రియు ముదల యిచ్చెను. తోడ్తో నాతఁడు జంకుగొంకు లేక కటారి గైకొని యావ్రేలి నంతవఱకుఁ ద్రుంచి ముద్రికను గైకొనెను. సమయస్ఫూర్తికి, పరాక్రమబుద్ధికి నానందపడి యాతఁడే రాజు కావలెనని తండ్రి యానతిచ్చె.

తిమ్మరుసు మంత్రిశేఖరుఁడయి యుండగా నుండఁ గృష్ణరాయలు పట్టాభిషిక్తుఁడయి పాలనము చేయసాగెను. ఈతఁడు రాజనీతివిశారదుఁడు. అంతగాఁ బొడుగరి కాఁడు. శరీరము దబ్బపండు చాయ. మొగమున గాంభీర్యము - కళ యుట్టిపడుచుండును. ఎదుటివాని నంతలో నాకర్షింపఁ జాలినవాఁడు. వ్యాయామకళలయం దెక్కువ మక్కువ. అద్దాన నొడలంతయు వ్యాయామకర్కశమై యొప్పారుచుండును. ధనుర్విద్యలోఁగూడ నారితేరిన చేయి.

ఇట్టి లక్షణము లన్నియు రాజన్యులలో నెందఱకో గలవు. ఈతని మహత్త్వమును జూపఁజాలినవి — అవి మాత్రమే కావు.

కవిత్వ మున్నచో రాజ్య మెందులకోయి యని తొల్లి యొకకవి పలికినాఁడు. రాజుకన్నఁ గవిరాజు మిన్నయని దాని భావము. రాయలు కేవలము మహీశ్వరుఁడే కాదు — కవీశ్వరుఁడుకూడ. ఇటు కవీశ్వరశ్రేణికిఁ జెందినాఁడు. అటు మహీశ్వరపదవిని బొందినాఁడు.

అష్టదిగ్గజములవంటి మేటికవు లెనమండ్రు చుట్టును బరివేష్టించి యుండ నొకప్పు డీతఁడు సాహిత్యచర్చను సాగించును. బృహస్పతిని బోలు తిమ్మరుసు మున్నగువారితో వేఱొకప్పుడు రాజకార్యములు నిర్ణయించును. కవి యన్నవాఁ డెవఁడైన నరుదెంచెనా, రాయల పరీక్షకు నిలువ వలసినదే. పరరాజును బ్రాభవోపేతుని సయితము త్రుటిలోఁ దూలనాడును గాని కవిరాజును గౌరవమునఁ గాంచుటయే యాతని నైజము.

సంస్కృతవాఙ్మయప్రపంచమున భోజరాజేటులు చిరంజీవియో యాంధ్రవాఙ్మయప్రపంచమున నీతఁడట్లు. ఉభయ భాషలలో నీతఁడు ప్రౌఢకావ్యములను వ్రాసి పేరు నిలుపు

కొనిన మేటి. సారస్వతరంగమున నాతనిస్థానము నిరూపింప వలయునన్న 'ఆముక్తమాల్యద'—యను నాతని—ఒక్క గ్రంథమే చాలు. నాఁటికి నేఁటికి నెప్పటికి నయ్యది యాతని పాండిత్యము వేనోళ్లఁ జాటుచుండును.

రాయలసభకు భువనవిజయ మనిపేరు. నిచ్చలు నయ్యెడ— అష్టావధానములు-శతావధానములు- ఆశుకవిత్వములు చెలరేగుచుండెడివి. ఒడ్డోలగంబున నుండి విద్యావినోదముల సంతోష మొందుచు భాషాభ్యుదయమునకు దేశాభ్యుదయమునకు బద్ధశ్రద్ధ చూపెడివాఁడు. సప్తసంతానములలో ఖిలముకానిది కావ్య మొక్కటియే. అట్టి కావ్యములను బెక్కింటిని రచించియు, రచింపించియుఁ గృతికర్తయుఁ గృతిభర్తయు నయి యాభూభర్త కీర్తనీయుఁడయ్యె.

కేవలము విద్వద్గోష్ఠియందె కాలము పుచ్చక యొక్కొక్కప్పుడు రాత్రులందు మారువేసములు దాల్చి, ప్రజలలోని దోసములను పరిపాలనలోని మోసములను గుఱుతించి సవరించెడివాఁడు. సంవత్సరాది-దీపావళి మున్నగు పర్వదినములందు గొప్పగా సొమ్ము వెచ్చపెట్టి సమావేశములు జరిపించుట కలదు. అందు కవులు-గాయకులు-నటకులు-శిల్పులు-మల్లురు లోనగు కళాప్రవీణులు పెక్కురు పాల్గొనుచుందురు.

ఆయాయి కళలలోని రహస్యములను రాయ లెఱింగి వారి వారికి సన్మానములను జరుపుచుండువాఁడు.

పరాక్రమమున నిరంకుశుఁడయి, పాలనమున ప్రజారంజకుఁడయి, వాఙ్మయమున మహాకవియయి దేశమునకు వన్నె తెచ్చిన శ్రీకృష్ణదేవరాయలవంటి రాజశిఖామణి యానాఁడు భారతావనిని గానరాఁడు.

# పెద్దన

కర్నూలు మండలమున దూపాటిసీమలో దోరణాల యను గ్రామము కలదు. అందు నందవరీకబ్రాహ్మణుఁడగు చొక్కనామాత్యునకు 'పెద్దన' యుద్భవించినాఁడు. ఈతఁడు చిన్ననాఁడె శఠగోపయతి యను గురువు నాశ్రయించి, ఆంధ్ర గీర్వాణభాషలలో అనుపమానమగు వైదుష్యమును గడించెను.

విద్యార్జనానంతర మీతఁడు, రాయల యష్టదిగ్గజకవులలోఁ బేరు సార్థక మగునటులు పెద్దకవి యనిపించుకొని ప్రఖ్యాతి నందసాగెను. స్మార్తుఁడయ్యు నీతఁడు గురుపరంపరను బట్టియో, రాయలమీఁది యభిమానమునఁ జేసియో వైష్ణవ మతప్రవిష్టుఁడయ్యె. ఈ కవి యన్న రాయల కెంతయో గౌరవము. అద్దాన నాతనికి రాజకీయవిషయములందు నయితము తోడ్పాటు సూపుచు, ఆతని సామ్రాజ్యాభ్యుదయము తోపాటు తానును ప్రాభవ మందెను.

ఒకప్పుడు రాయలు పండితగోష్ఠి కావించి పసిండి పళ్లెరమున బంగారు గండపెండేరముంచి, యచ్చటి విద్వత్సమాజము నుద్దేశించి యిటులు పలికెను. — 'కవీశ్వరులారా, మీలో నేరైనఁ గానిండు; సంస్కృతాంధ్రములలో సమానముగ హృద్యమగు కవిత్వము సెప్ప నేర్పుగలారు ముందునకు రండు; కవితాపటిమను బ్రకటింప నిదియే తగిన యదను. వలంతులగు వారు మాత్రమ యీగండపెండేరమును గైకొనుఁడు'. అని,

కాని యెవ్వరును సాహసింపరైరి. కొంతవడికి రాయలు తానేలేచి,

‘ముద్దుగ గండపెండియరము ముం గొనుఁడంచు బహూకరింపఁగా
నొద్దిక నాకొసంగు మని యొక్కరుఁ గోరఁగ లేరు లేరొకో!

అన్నంతనే,

మన పెద్దన లేచి,

పెద్దనఁబోలు పండితులు పృథ్విని లేరని నీవెఱుంగవే
పెద్దన కీఁదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా!’

అని సమాధాన మొసఁగి, సంస్కృతాంధ్రకవితాకీర్తి యిటులుగదా యుండవలె ననుచు నాశువుగ దీర్ఘమగు పద్య మొకటి వెలువరించెను. రసజ్ఞశేఖరుఁడగు రాయలాతని కవితా వైదుష్యమున కానందించి తోడ్తోన గద్దియ డిగ్గి తాన పెద్దన కవివరుని పాదమునకు గండపెండేరమును దొడిగి గొప్పగా గారవించె.

కవితలో నీతని పెద్దతనమును పరిస్ఫుటముగా ప్రక టింపఁ జాలినది ‘మనుచరిత్ర’మను గ్రంథము. సంస్కృతభాష లోని సామాన్యమగు నొక కథను గైకొని యీతఁడిచ్చ వచ్చి నటులు క్రొంగ్రొత్త పోకడలతోఁ గావ్యరచన కాదర్శమగు తీరున-ఇతివృత్తమును బెంచి మనుచరిత్రమును రచించెను. బంగారునకు వాసన యబ్బినటు లాగ్రంథమునకు రాయలే

కృతిపతి. కృతిపతియుఁ గృతికర్తయుఁ గీర్తిమూర్తులను గాంచవలెనన్నను, నిరుపురయు నాదరాభిమానములు తెలియవలయునన్నను మనుచరిత్రమే తార్కాణ. జగత్సృష్టిలో పితామహునిఁ జేర్కొనునటులు-ఆంధ్రకవితాసృష్టిలో— ఆనాఁడీపెద్దనకవిని జేర్కొనుటచే, రాయలే యీతనిని 'ఆంధ్రకవితాపితామహ' యని పిలువసాగెను. నాఁటినుండియు నీతని కది యొక బిరుదమయ్యె.

రాయల యనంతరముగూడ పెద్దన కొన్నాళ్ళవఱకు జీవించియుండెను. కాని యాయానందమేది! ఆ 'భువనవిజయమున'— ఆవిద్వద్గోష్ఠిలో-ఆసార్వభౌముని మ్రోల వెలింగిన రోజులు తొలంగినవి. మున్ను రాయల యాశ్రయమునఁ జేసి యీకవికి ననంతరముకూడ ధనమునకు లోపము లేకపోవచ్చును. కాని, యనిర్వచనీయమగు-అట్టిప్రాభవమునకు-అట్టి యానందమునకు లోపమే వాటిల్లినది. కావుననే యీకవివరుఁడు.

'కృష్ణరాయలతో దివి కేఁగలేక బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు'
అని తుదకుఁ దనజీవితమునకు రోసినాఁడు.

రాయల యస్తమయముతో పాటు విద్యానగర వైభవము నయిత మస్తమింపసాగినది. అటనటఁ దురుష్క మహీపతులు తలలెత్తసాగిరి. విద్యానగర వీరులెల్లరు నిర్వీర్యులయిరి.

పత్తనమందలి ప్రాభవమంతయుఁ బతితము కాసాగినది. అదియు యదనుగా భావించి కటకదేశాధిపతియగు గజపతి విజయనగరముమీఁదికి దండెత్తి వచ్చె. అడ్డగించెడి ధీరుఁడే కానరాఁడు. యుద్ధప్రయత్నముల మాటయే వినఁబడదు. ప్రజలందఱిలో నల్లకల్లోలము వెలువడియె. ఇట్టితఱి రాయల యాప్తుఁడగు మన పెద్దనకవికి - అద్భుతవిషాదరోషములు ముప్పిరిగొనియె. తోడన తానొక్కఁడె గజపతిసన్నిధికిఁ బోయి తీవ్రముగ నిటులు దూషింపసాగెను :—

" సీ॥ రాయరాహుతుగండ రాచయేనుఁగు వచ్చి
యారట్లకోట గోరాడునాఁడు,
సమ్మెట నరపాలసార్వభౌముఁడు కంచు
తలుపులఁ గరుల డీకొలుపునాఁడు,
సెలగోలు సింహంబు చేరి ధిక్కృతిఁ జేసి
సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడు,
ఘనతరనిర్ఝర గండపెండెర మిచ్చి
కూఁతు రాయల కొనఁగూర్చునాఁడు,
నోడలెఱుంగవో! చచ్చితో! యుర్వి లేవో!
చేరఁజాలక, తలచెడి, జీర్ణమైతో!
కనదరాజ్యంబు సొచ్చితే గజపతీంద్ర,
తెఱచినిలు కుక్క సొచ్చిన తెఱఁగు దోఁప".

అదివిని యారాజు యుద్ధమునకై రాలేదని చాటుమాట వైచి క్షమింపుఁడని పలికి, తత్క్షణమ యటనుండి ససైన్యముగఁ దరలిపోయెను.

పరిస్థితు లన్నియు నాతీరుగ మారుటఁజేసి పెద్దనకు హృదయశాంతి యన్నది లేదు. జీవితనైరాశ్యమున విసుగెత్తి సుమారఱువది డెబ్బది యేండ్ల ప్రాయమందె లోకయాత్ర ముగించెను.

కవితల్లజులనుగూడ రాజ్యాంగమునకు బ్రాపుగా నిలఁ బెట్టుకొనిన తెలుఁగుతల్లీ, నీవన్నింట, నాఁడు ధన్యురాలవు. ఆనాఁటి నీపుత్త్రులును ధన్యులు ; ధన్యతములు !!

# రామకృష్ణుఁడు

కృష్ణామండలమున గారపాడను గ్రామము కలదు. అందు లక్ష్మమ్మ రామయ్యయను దంపతులకు రామకృష్ణకవి జన్మించెను. ఇతని బాల్యదశయందె జనకుఁడు గతించినాఁడు. అంత నీతని మేనమామ స్వగ్రామమగు తెనాలికి నీతనిని దీసికొనివచ్చి పోషింప సాగెను. ఆయూరఁ గల రామలింగేశ్వర దేవుని నామముకూడ నీతనికి వాడుచుండిరి. ఇతని చరిత్ర మతి విచిత్రము.

చిన్ననాఁడే యీతఁడు కొంటెకోనంగిరాయై చదువుసంధ్యలు సాగింపక యల్లరిచిల్లరగ నెల్లయెడలఁ దిరుగసాగెను. అట్టియితని కొక్కనాఁడొక్క సిద్ధుఁ డెదురువడి యీతని తేజోవిశేషములను లెస్సగా గుఱుతించి సంతసించి, బ్రాహ్మణుండగుట యెఱింగి కాళికాదేవిని సాక్షాత్కరించుకోఁగల మంత్ర మొకటి యుపదేశించె.

అంత నారేయి రామకృష్ణుఁడు మంత్రప్రభావంబెఱుంగఁ గోరి కాళికాదేవిని యథావిధిగ నుపాసించెను. ఆమెయు భక్తవత్సలకాన సాక్షాత్కరించెను. ఎదుట నీతఁడు వినీతుఁడయి 'దాసోఽహమ'ని దోసిలొగ్గి నిలిచియుండెను.

కాళి— వత్సా, కరుణించితిని. ఇవిగో స్వర్ణరజతపాత్రములు. ఇందొకదానిలోఁ బెరుగును, మఱొకదానిలోఁ బాలును

గలవు. ఒకటి కోరిన విద్యయు ; రెండవది త్రావిన నైశ్వర్యమును లభించును. ఇందెయ్యది నీకు వలయునో వేడుకొమ్ము !

రామకృష్ణుఁడు — అమ్మా, వాని నొక్కసారి యిత్తువేని చూచి, యందలి విశేషములను గమనించి యావలఁ గోరుకొందును.

నాపిని వల్లెయని యాదేవి యట్టులె యాపాత్రములు రెండింటి నాతని కొసంగెను. ఒసంగినదే తడవుగ నాతఁడొకే సారి యాదధిక్షీరములను ద్రావి, 'తల్లీ, రెండును రుచ్యములే కానఁ ద్రావితిని. కోపింపకుము'. అని నవ్వుచుఁ బలికెను.

ఆజ్ఞోల్లంఘన మొనర్చినందుల కాయమ కినిసి, విద్వాంసుఁడ వయ్యు వికటకవి వయ్యెదవు పొమ్మని శపించెను. అందుల కాతఁడు జంకి యజ్ఞానమును సైఁపుమని యనేకవిధములఁ బ్రార్థించెను. తుదకామె దయచూపి 'రాజసభాభూషణంబవై రాజిల్లెదవు పొమ్మ'ని వరమొసఁగె.

నివురు గప్పిన నిప్పువోలె నున్న యారామకృష్ణుఁడు కాలక్రమమునఁ బ్రఖ్యాతి నందఁజొచ్చెను. హాస్యవర్తనమం దీతఁడు ప్రసిద్ధుఁడయ్యె. ఈతని మహిమ యెఱింగి యాంధ్రభోజుఁడగు కృష్ణరాయలు తన యాస్థానమున కీతని రావించుకొని పోషింపసాగెను.

ఆనాఁడు కృష్ణరాయుల యాస్థానమునఁ బేరుగన్న కవు లెనమండ్రు 'అష్టదిగ్గజముల'ను పేర వెలయుచుండిరి. వారిలోఁ జేరిన మనరామకృష్ణుండు పెక్కువిషయములందుఁ జతురుం డయ్యెను. సమస్యలను పూరించుటలోను, సమయోచితముగఁ బలుకుటలోను నీతనికి నీతఁడే సాటి. ఎంతవారికేనియు నెదుటి వారికిఁ దలవంపులు కలిగించుటలో నీతఁడు మేటి.

ఒకప్పు డీరామకృష్ణుఁడు ముక్కుతిమ్మన యనుకవీశ్వరు నింటి కరిగెను. ఐశ్వర్యవంతుఁడగు నాకవీశ్వరుఁ డట్టితటి బంగా రుటూయలలో నూఁగుచుండె. హాస్యచతురుఁడగు రామకృష్ణుఁ డాతనిదరిఁ జేరి 'తాతా, యూఁతునా' యని పృచ్ఛించె. అతఁడును సరియే యని సమ్మతించెను. అంత రామకృష్ణుఁ డది యవకాశముగాఁ గైకొని తుప్పున నాతనిపై నుమిసి పోయె. ఔరా! రామకృష్ణుఁ డెంతకొంటెరా యని తిమ్మనకవి లోలోనఁ దలంచి తన పొరపాటునకు నొచ్చుకొనియె.

తెనాలి రామలింగము కథలనుచుఁ దెలుఁగు వారిలో వాడుకొను కథలన్నియు నీతనిగూర్చియే చెప్పుచుండును. ఇతర కవుల యూరుపేరులు తెలియని పామరులు సయితె మీకథల రూపమున నీతని నెఱింగియే యుందురు. వైష్ణవమతప్రవిష్టుఁ డయినపిదప నీతనికి రామలింగ మనుపేరు రామకృష్ణుఁడుగా మాఱిన దందురు. ఈతని సుప్రసిద్ధమగు కావ్యము పేరు

పాండురంగమాహాత్మ్యము. గొప్పతనమును గమనించి పండితులద్దానిని పంచకావ్యములలో గణుతింతురు.

తన కవిత్త్వవిశేషమువలన పాండిత్యప్రతిభ మూలమున తెనాలిగ్రామము నగ్రహారముగా నేర్పఱచి, ఖ్యాతి నందిన యీతనిని దెలుఁగువారు మఱువలేరు. హాస్యరస ముట్టిపడు పట్టులం దెల్ల రామకృష్ణుఁడు స్మరణకు రావలసినదేగదా !

# రామరాజభూషణుఁడు

గుంటూరు మండలమందలి మోదుకూరను ఊరు ప్రసిద్ధులగు బట్టుకులస్థుల కునికిపట్టు. వదాన్యులగు రాజన్యుల దరిఁజేరి, వారి వంశకీర్తిశౌర్యాదులను గైవారము సేయుచుఁ బండితగోష్ఠిలో మెలంగుచు మన్నన లందుట బట్టుకొలమునకుఁ బరిపాటి. అట్టి వంగడమున నొకప్పుడు, చుక్కలలోఁ జంద్రుఁడువోలె భట్టుమూర్తి యను కవిచంద్రుఁడు జనన మందెను.

బాల్యమందె యితఁడు విద్యాభిలాషమున పెద్దనకవి యొద్దకుఁ జేరెను. ఆకవి యీతని భక్తిప్రపత్తులను జుఱుకుదనమును గాంచి విద్యామర్మంబుల నెల్లఁ గాలక్రమమున బోధింప సాగెను.

ఒకప్పుడు పెద్దనకవి పరుండియుండి యొకానొక వర్ణనముగూర్చి యూహాపోహములు సలుపుచుండె. అట్టితఱి నాతని సన్నిధి నున్న భట్టుమూర్తి యది గుఱుతించి యావర్ణనాంశమునకుఁ గల సాధకబాధకములను జర్చించి యిదమిత్థమని తాను నిర్ణయించెను. ఆతని మనోదార్ఢ్యమున కచ్చెరువందిన యాగురువు మత్సరగ్రస్తుఁడయి వానితో నిటులనియె-

ఓయీ, నేటినుండి నీవిట నుండవలదు. ఇంటికడనే పాఠములు చింతన చేసికొనుచుండుము. అదనెఱిఁగి నిన్ను ఱేనియొద్దకుఁ దీసికొని పోదును. నాయెఱుక లేక రాజదర్శనార్థమై యరుగ కుముసుమా'. అని.

వల్లెయని యాతఁ డానాఁడు సెలవు గైకొని, తన పరీక్షావిశేషములు పెద్దనకే విభ్రాంతి గొల్పెననియు, నాతని యెఱుక లేక ఱేనియొద్ద కరుగరా దనుటలో విశేష మున్నద నియు నెఱింగి రాజదర్శనార్థమై వేగిరపడుచుండెను. ఒక్క నాఁడు శుభలగ్నమున నాతఁడు కవీశ్వరుని వైఖరితో నగరి కరిగి ఱేనిం దర్శించి సమయోచితముగ సంభాషణలు సలిపి పాండిత్య ప్రకర్షమున ఱేనిని రంజింపఁజేసెను. నాఁటినుండి యాతఁడును 'అష్టదిగ్గజకవుల'లో ముఖ్యుఁ డయ్యె.

రామరాజు నాస్థానమునకు భూషణము వంటివాఁడు కాన నీతఁడు రామరాజభూషణుఁ డయ్యె నందురు. గురువు రచించిన గ్రంథమును మించి యుండవలెనని యాతఁడు సంక ల్పించి, నానావిధకావ్యశోభల కాటపట్టగు 'వసుచరిత్ర' మను కావ్యమును; రెండర్థములను జూపుచు వన్నెకెక్కిన 'హరి శ్చంద్ర నలోపాఖ్యానము'ను రచించినాఁడు. ఇయ్యవి రెండును రామరాజభూషణుని కీర్తిమూర్తికి సూచకములు.

ఈకవి, కృష్ణరాయల యంతటి సార్వభౌముని సభాస్థలమున విద్వద్గోష్ఠి జరుగుపట్ల నాయకమణివలె విరాజిల్లెడివాఁడు. నాలవకులమువాఁడని యీతని పాండిత్యప్రకర్షకు మాత్సర్యము వూను పండితమానులు కొందఱి గుండెలు జల్లుమనునట్లు, రాయలంతటి రసికుఁడు విద్వత్సమాజము మ్రోల రామరాజభూషణుని సింహాసనమునఁ గూరుచుండఁ బెట్టుకొని గొప్పగా గారవించెడివాఁడు.

ఈతనికి సాహిత్యరసపోషణుం డని బిరుదు కలదు. సంగీతకళాగహాస్యములం దీతఁడు నిధి. సంగీతసాహిత్యములు రెంటను నిట్టిమేటి, నాఁటికి నేఁటికి వేఱొకఁడు లేఁడనుట పొగడ్త కాదు. వీణియలకు మెట్లు కల్పించినవాఁ డీతఁడేయని వాడుక. ఇతఁ డాంజనేయోపాసకుఁడు కూడ.

ఆనాఁడు రాజులలోఁ గృష్ణరాయలువలె మంత్రులలో తిమ్మరుసు సుప్రసిద్ధుఁడు. ఇతఁడన్న రాయల కత్యంతగారవము. రాయల రాజ్యమున తిమ్మరుసు సర్వాధ్యక్షుఁడు. అట్టి తిమ్మరసును రామరాజభూషణుఁ డెన్నఁడును గైవారము చేసి యెఱుఁగఁడు. అద్దాన మంత్రి కీతఁడన్నఁ గొంత మత్సరమేర్పడియెను. ఇది గుఱుతించి పెద్దన మున్నగు తక్కిన కవులు కొందఱు లోలోన నాలోచనలు సలిపి తిమ్మరసుతోఁ జేరి రామరాజభూషణుని వంచింప నెదురు చూచుచుండిరి.

ఇటులుండ నొకప్పుడు రాయలసభలోఁ దెనాలి రామకృష్ణుఁడు పద్యమొక్కటి చదువఁగా బాగుబాగని యందఱు నానందించిరి. భూషణుఁడు మాత్రి మూరకుండె. నీవేమి యూరకుంటి వని యితరు లాతనిఁ బ్రశ్నించిరి. అందఱకు బాగుగా నున్న నాకుమాత్రము బాగుగాదా యని భూషణుఁ డనియె. 'సరియే కానిమ్ము, ఇంతకు మిన్నగా నీవెద్దియేనిఁ జెప్పుము. చెప్పనేరనిచో — ఆసింహాసనమునఁ గూరుచుండఁ దగవు'. అని రామకృష్ణుఁడు నొక్కి చెప్పెను. ఔనౌనని తిమ్మరుసు దాని ననువదించి తాళము వైచెను.

ఈతీరుగ నిందఱిట్టి కుటిలు సలుపుచుఁ బ్రవర్తింప నూరకుంటివా యని పలుకుచు, రాయలనుగూర్చియుఁ గుటిలకు ముఖ్యుఁడగు తిమ్మరుసును గూర్చియు భూషణుఁ డిరువది యాఱు పాదములు గల పద్యమొక్కండు తత్క్షణమ యాశువుగఁ జదువసాగెను. దానికి రాయ లానందించి యనర్ఘ్యము లగు బహుమానము లొసంగి గాఢాలింగనము కావించెను. శ్రోత్రో నాపెద్దనాదికవులే యాపద్యము రామకృష్ణుని పద్యముకన్న మిన్నయే యని తద్దయు సంతసించిరి.

ఇఁక భూషణుఁ డాప్రస్తావన విడిచి, నాఁటి యాలోచనలకు మూలపురుషుఁడగు తిమ్మరుసు దెసఁ బరికించి, యాతని

చిన్ననాఁటి నైచ్యమునుగూర్చి పద్యముగాఁ జదువసాగెను. ఆమంత్రియు జంకి వెంటనే, రాయలవారు పట్టాభిషేకమునఁ దన కొసంగిన యమూల్యరత్నహారమును దీసి కవికంఠము నలంకరింపఁ జేసె. తత్క్షణము, దుష్కీర్తిసూచకముగా వెడలుచున్న పద్యమును — ఆశీర్వాదముగ వెడలించి భూషణుఁడు కవిలోకభూషణుఁ డయ్యెను. నాఁటినుండి మంత్రికి నీకవికి సఖ్యము మెండయ్యెను.

కవిరాజునగు నమ్మహారాజు, మంత్రిశేఖరుఁడగు తిమ్మరుసు రామరాజభూషణునకు బ్రహ్మరథము పట్టుచుండ నాతని కింకను లోటేమి! ఆతఁడు నిచ్చలు లక్ష్మీసరస్వతులను ప్రత్యక్షమొనర్చుకోఁజాలినాఁడు. ఆతని దివ్యచరిత్రమును ఘంటాపథముగఁ జాటుట కాంధ్రప్రపంచమున నాతని రెండు కావ్యములే చాలును. గుణములే పూజ్యస్థానములు కాని కులగోత్రములు వయసుసొగసులు కావుగదా !!

# చిన్నయసూరి

దక్షిణదేశమున పెరుంబూదూరను దివ్యక్షేత్ర మొకటి కలదు. అందు చాత్తాదశ్రీవైష్ణవకులమువారిలోఁ గొన్ని గొప్ప కుటుంబములు కలవు. వారు పుట్టుకనుబట్టి-అగ్రజన్ము లనువారిలోఁ జేరకపోయినను; విద్యావైదుష్యము-భక్తిప్రపత్తులు-ఆచారనిష్ఠలు లోనగువానియెడ - అగ్రేసరులుగా గణింపఁ దగుదురు.

అట్టివారిలో పరవస్తు వేంకటరంగయ్య యనువారు సుప్రసిద్ధులు. అతఁడు న్యాయ-వైశేషిక-మీమాంసాది ధర్మశాస్త్రములలో నందె వేసిన చేయి.

నాఁటికే యాంగ్లేయులు భారతావనియం దంతట నెగఁబ్రాకి యుండిరి. ఆంగ్లవిద్య-ఆంగ్లేయాచారములు కాలక్రమమున నెలకొన సాగెను. పరిపాలితులగు భారతీయులకు పాలకుల యాదర్శములే శరణ్యము లైనవి.

రాజధానీ నగరములయందు న్యాయనిర్ణయములు జరుగవలయును. అందులకై యాంగ్లపుత్త్రులే న్యాయాధిపతులుగా నేరుపడిరి. కాని, యీదేశపువారి యనాదిసంప్రదాయములు, న్యాయనిర్ణయవిధానము తొట్టతొలుత గుఱుతించుట దుస్సాధ మయ్యెడిది. అందు వలసిన 'సలహా'ల నందుటకై యాయాయి చోటుల తత్రత్యులగు పండితులనే సాయముగా నేర్పఱచుకొని న్యాయనిర్ణయము కావించుచుండిరి.

ఇట్టిస్థితిలో చెన్నపట్టణమందలి యున్నతన్యాయాధికారులకుఁ దోడ్పాటుగా వేంకటరంగయ్యను ప్రభుత్వము నిర్ణయించెను. వలసినపట్టులందు-వేంకటరంగయ్య-న్యాయనిర్ణయదక్షుఁడయి-న్యాయాధిపతులకు నుపదేశకుఁడుగా నయి పెక్కు మన్ననల నందుచుండెను. ఆనాఁ డీతఁడు సంస్కృతాంధ్ర ద్రావిడ భాషలలో సంపూర్ణపాండిత్యము కలిగి యధికారులందు-అనధికారులందు మెప్పు వడయుచుండెడివాఁడు.

అట్టి పండితశ్రేష్ఠునకు 'చిన్నయ్య' యను సుపుత్త్రుఁడు జన్మించెను. వంశమా! సత్సంప్రదాయముల కాటపట్టు. జనకుఁడా! విద్వద్వరేణ్యులకుఁ దలమానికము. అట్టిచో చిన్నయ్యకుఁ జిరుతప్రాయమందే పాండిత్య మబ్బుటలో నబ్బురము లేదు.

చిన్ననాఁటినుండియు చిన్నయ్య తండ్రియొద్దనే సంస్కృతాంధ్రద్రావిడభాషలను జదువసాగెను. ఈతని చురుకుదనము గుర్తించి, విద్యాభ్యాసమునఁ దండ్రియు నేమరపాటు నొందఁడయ్యెను. తండ్రికడనే గొప్పవిద్యల నభ్యసించు భాగ్యమేకొలఁది తనయులకు మాత్రమో కలుగును.

లేఁబ్రాయమందె చిన్నయ్య, తర్కవ్యాకరణశాస్త్రములలోఁ దీర్పరి యయ్యెను. ఎంతటి కఠినవిషయమైనను సులభముగ నవగాహన మొనర్చుకొనఁగల నేర్పరి. మీఁదుమిక్కిలి

యేకసంథాగ్రాహి. క్రమముగవిద్య నార్జించి, చెన్నసగరమునఁ గల పండితవర్యులతోఁ జేరుచు నిష్టాగోష్ఠిని మెలంగుచుండెను.

అట్టిరోజులలో - ఆనగరమున రాజధానీకళాశాలకు నిరువు రాంధ్రపండితులు కావలసి వచ్చిరి. అసంఖ్యాకులగు పండితులు తదుద్యోగము నపేక్షించి ప్రయత్నములు సలుప సాగిరి. అంత నధికారులు వారాణసినుండి గొప్పపండితులను రావించి వారిచేతఁ బరీక్షలు జరిపించిరి. అందు పప్రథమము లుగ చిన్నయ్య జయ మందెను. వెంటనే యాతఁ డాకళాశాల యందు ప్రధానపండితుఁడుగను; చెన్నసగరపాఠ్యగ్రంథనిర్ణాయక పండితసంఘమున కధ్యక్షుఁడుగను నిర్ణీతుఁడయ్యె.

ప్రాయకముగా దేశమునఁ బాండిత్యముమాట యటుండ-అక్కరములైనను జక్కగారాని వ్యక్తులు సయితము కొందఱు 'శాస్త్రి' యనియు 'పండిత' యనియు బిరుదములు తగిలించుకొందురు. అంతటి పండితుఁడయినను చిన్నయ్యకు బిరుదు లేకుండెను. అది సహింపలేక చెన్నసగరములోని దొర యొకఁడు, పండితులను బెక్కురను సమావేశపఱచి, చిన్నయ్యకు 'సూరి' యను బిరుద మొకటి నిర్ణయించెను. నిర్ణయించి, యా యక్షరములను బంగారుకడియమందుఁ జెక్కించి సీమలోనే దానిని సిద్ధము చేయించి యీదేశమునకుఁ దెప్పించెను. అంత నొకనాఁ డాదొర, పండితగోష్ఠి నేరుపఱచి యందుచిన్నయ్యను

బెక్కు తెలుంగులం గొండాడి యాబిరుదము నొసంగి బహూక రించెను. నాఁటినుండి చిన్నయ్య చిన్నయసూరి యయ్యెను.

ఈతఁడు కేవలము పండితుఁడే కాదు. గొప్ప వక్తకూడ. అప్పుడప్పు డానగరమున నీతని భాషావిషయకోపన్యాసములను బెక్కుమంది పండితులు వినుచు సంతుష్టు లయ్యెడివారు. ప్రాచ్యవిజ్ఞానము గల గొప్ప భారతీయోద్యోగులు పెక్కు మంది యీతనికి మిత్త్రులు. స్వసంఘసమావేశమును సిద్ధ పఱచి, విశిష్టాద్వైతవైష్ణవమతమును బోధించుచు సంఘము నుద్ధరించెడివాఁడు.

ఇఁక నాంధ్రభాషాయోషకు వచనరచన యను నలం కార మొసఁగి యర్వాచీనుల కాదర్శకుఁ డయ్యె. తెలుఁగునను సంస్కృతమునను తెలుఁగువ్యాకరణమునుగూర్చి యోగ్యమగు రచనలో గ్రంథములు కావించెను. ఈతనివి పెక్కు గ్రంథ ములు నేఁటికిని ముద్రింపఁబడక యట్లే యుండుట తెలుఁగువారి దౌర్గత్యము.

దురవగాహములగు శాస్త్రములందును వ్యాసంగ మొనర్చి, సాహిత్యచక్రవర్తి యయి, శమదమాదిగుణవిరాజి తుఁడయి, నిగర్వచూడామణి యయి, కవియై, యుద్యోగియై ఖ్యాతి గాంచిన చిన్నయసూరినిబోలు వ్యక్తి, వేఱెవ్వఁడు నర్వాచీనులలోఁ గానరాఁడు. పండితమాన్యులగు బ్రాహ్మణ పండితులే పెక్కుమంది చిన్నయసూరికి శిష్యులయి యుండుటం జేసి చిన్నయ-సూరి యగుటలో చిత్రమేమున్నది?

# వీరేశలింగకవి

నన్నయనాఁటినుండి నేఁటిదనుక ఆంధ్రదేశమున రాజమహేంద్రవరము సర్వవిద్యల కాటపట్టుగ వెలయుచున్నది. పవిత్రగోదావరీ మాహాత్మ్యమునఁజేసియో నగరనిర్మాణకాల విశేషమునుబట్టియో యెందఱెందఱో కవివరులు-ఎందఱెందఱో పండితపుంగవులు రాజమహేంద్రవరనివాసులగుట పేర్కొనఁదగ్గ విషయము.

గణనీయులగు రాజమహేంద్రపురవాసులలో వీరేశలింగకవి యొకఁడు. ఈయన యింటిపేరు కందుకూరివారు. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. లోహిత సగోత్రుఁడు. ఈయన పితామహుఁ డానాఁటి యొక జమీందారునియొద్ద మంత్రి. తల్లిపేరు పున్నమ్మ. తండ్రి సుబ్రహ్మణ్యము. వీరేశలింగము 1848-వ యేఁట, ఏప్రియలు-పదునాఱవ తేదిని రాజమహేంద్రవరమున జన్మించెను. ఈతని చిన్ననాఁడే తండ్రి పరమపదించుటఁజేసి, పినతండ్రియే బాధ్యత వూని యీతనిని పెంచి పెద్దవానిని జేసి విద్యాబుద్ధులు నేర్పించెను.

నాఁడు పరదేశభాష యగు ఆంగ్లభాష మనదేశమందంతట నంతఁగా నలముకొని యుండలేదు. అంతయో యింతయో కలవారుమాత్రమే తమబిడ్డల కాభాషను జెప్పించుచుండిరి. మన వీరేశలింగముకూడ ఆంగ్లపాఠశాలలోఁ జేరి, యిప్పటివారివలెఁ గాక ప్రత్యేకముగఁ గాళిదాసకావ్యములను

గూడ బఠించుకొనుచు; 'మెట్రిక్యులేషన్' పరీక్షయందుఁ గృతార్థుఁడయ్యె. పఠించునది పరదేశభాషయైనను, ఆంధ్రము-అంగభాషగా నున్నను నీతఁడు మాత్రము తెలుఁగును విడనాడక ప్రత్యేకవ్యాసంగము కావించుచుఁ బిన్ననాఁటనే కవిత్వము చెప్పఁజాలి శతకములుకొన్ని రచించెను. అష్టావధానములు నేర్చెను. ధారణాశక్తి యలవడియె. చిత్రకవిత్వమునఁ బ్రౌఢుఁడయ్యె.

ఆంగ్లవిద్యాభ్యాసము ముగిసినపిదప ఆయాయిచోట్ల అధ్యాపకపదవి స్వీకరించి సుమా రిరువది యెనిమిదవయేఁట రాజమహేంద్రవరములోని దొరతనమువారి యాంగ్లకళాశాలయం దాంధ్రపండితుఁ డయ్యెను. అటనుండి గ్రంథరచన హెచ్చు కాసాగెను. సంస్కృతములోని శాకుంతలమువంటి సరసములగు నాటకములను; హృద్యములగు గద్యగ్రంథములను దెలుఁగున రచించుచు నొకవంకఁ గవిత్వధోరణితోఁ గాలము గడుపుచుండెను. మఱొకవంక-ముద్రాయంత్రమును సంపాదించి, 'వివేకవర్ధని' యను పత్త్రికను నెలకొల్పి హాస్యరస ముట్టిపడునటులు; దోషకారుల దోసములు విశదపడునటులు; సంఘములోని దురాచారములు స్పష్టమగునటులు పత్త్రికానామము సార్థమగునటులు ప్రయత్నములు చేయుచుండెడివాఁడు. ఈతఁడు చేపట్టిన యధ్యాపకపదవి ధనార్జన

మునఁ జిన్నదైనను-ఈతని వ్రాఁతలన్న ప్రభుత్వోద్యోగులు మున్నగువారికి సయితము గుండెగాలముగ నుండెడివి. ఈతఁడు బుద్ధిశాలియే గాదు; సాధువర్తనుఁడు—వినయగుణసంపన్నుఁడును.

తెలుఁగుకవులు మొదటినుండియు వచనగ్రంథముల వంకకుఁ బోయెడివారు కారు. కేవలగద్యమును వ్రాసినవారిని గవులలో నెన్నుకొనుటయు లేదు. అద్దాన నాంధ్రభాషలో నుత్తమవచనకావ్యములు వెలువడుటకు వీలుపడదయ్యె. ఈ లోపమును రూపుమాపి, యాంధ్రభాషాయోషను సర్వాంగ పరిపుష్టఁగాఁ జేయవలెనని వీరేశలింగకవి సంకల్పించెను. తోడనె 'రాజశేఖరచరిత్ర' వంటి వచనకావ్యములను రచించెను. సాంఘికాచారములందు-ఉద్యోగుల ప్రవర్తనలయందు-మానవుల నడవడికలందుఁ గల లోపములను బెక్కింటిని నిరూపించి సంస్కరింపఁ జేయఁజాలిన ప్రహసనరూపములగు గ్రంథములను వెలువరించెను. అన్నింటికన్న ముఖ్యమాతని 'యాంధ్రకవుల చరిత్రము.' ప్రాచీనకవు లెవ్వరో, వారి కావ్యము లెయ్యవియో, వా రెప్పటివారో, వారి నాదరించి పోషించిన రాజు లెవ్వరో, ఆనాఁటి భాషాపరిస్థితులు దేశస్థితియు నెట్టివియో, గుఱుతింప వలయునన్న ఆగ్రంథమే ప్రమాణము. తెలుఁగువాఙ్మయమున దానివిలువ యనంతము. తెలుఁగు

సీమను బెక్కుమంది వీరేశలింగకవి వచనగ్రంథములను బఠించి భాషాపరివేశము పొందఁజాలి యున్నారు ప్రాచీనులలోఁగాని యర్వాచీనులలోఁగాని, యీతీరుగఁ గొంగ్రొత్త తెన్నులు త్రొక్కి సర్వతోముఖమగు వాఙ్మయమును వెలువరించి భాషాసేవ చేసినవారు మఱెవ్వరు లేరు.

నాఁటికే యీతనికి గ్రంథరచనవలన నధికవిత్తము సమకూరినది. గ్రంథవిక్రయమువలన గడించిన సొమ్ము వ్యయ పఱచి రాజమహేంద్రవరమున గొప్ప పురమందిర మొకటి నిర్మించెను. పౌరులు సమావేశమగుటకు, సాయంసమయముల విశ్రాంతి గైకొనుట కామందిర మానగరమున నెంతో యుప యోగకారిగ నున్నది. ఊరివెలుపల మఱొక్కచోట 'వితంతు శరణాలయము'ను భవనమును నిర్మింపించి యాసంస్థకుఁ దన సొత్తును సుమారేఁబదివేల రూప్యములు విలువ గలదానిని సమర్పించెను. పురమందిరమునకుఁ బ్రక్కగ ప్రార్థనమందిర మునుగూడఁ గట్టించి ప్రార్థనసమాజ మేర్పఱచి దైవభక్తిని సమకూర్చు ధర్మోపదేశములు చేయుచుండెడివాఁడు. మఱియు నాపట్టణమున నున్నతపాఠశాల యొకటి నెలకొల్పి విద్యా సౌకర్యములుకూడ నొనఁగూర్చినాఁడు. అదియే నేఁటికిని 'వీరేశలింగాస్తికోన్నతపాఠశాల' యనుపేరఁ బ్రసిద్ధమై తోడి సంస్థలలో మిన్నయై వన్నెకెక్కి యున్నది. ఈతని జీవితచరి

త్రనుగూర్చి సమగ్రముగ వినవలయునన్న నీతని ‘స్వీయచరిత్ర’ యను గ్రంథమును ముఖ్యముగఁ బఠింపవలయును. ఈతని విద్యాభ్యాసము - ఉద్యోగప్రవృత్తి - భాషాసేవ - సంఘసంస్కరణము - దేశసేవ మున్నగు నంశము లన్నియు నాగ్రంథమునఁ గరతలామలక మగును. ఈతని సర్వవిధములగు సుగుణములను మహిమగల చరిత్రనుగూర్చి యొక్క పదములో సూచింప వలయునన్న ‘సంస్కర్త’ అన్నచో సరిపోవఁ గలదు.

దేశోద్ధారకుఁడగు నీకవీశ్వరుని గొప్పతనమును గొప్పగాఁ బరిగణించి నాఁటిప్రభుత్వ మీతనికి ‘రావుబహదూర్’ రని బిరుద మొసంగి గారవించెను.

సత్యమారయ ఆతని యకలంకజీవితమును - పాండితీ శేముషిని - ప్రజ్ఞాధురంధరత్వమును - అభినివేశప్రాభవమును- దేశోద్ధరణోద్యమమును వివరించి బోధింపవలెనన్న ప్రభుత్వము వారి బిరుదములు గావు సాధనములు ; ఆకవివర్యుని గ్రంథములే, ఆదేశోద్ధారకుని సంస్థలే, ఆమహనీయుని సజీవములగు నుద్యమములే.

తుదకు డెబ్బదిమూఁడవయేఁట మదరాసులోని ‘ప్రాచ్య లిఖితపుస్తకాలయము’న గ్రంథపరిశీలనము కావించుకొనుచునే జ్వరగ్రస్తుఁడై కాలధర్మ మందెను.

కవులకథలు

దేహము - గేహము, విత్తము - విద్య, కాలము - సర్వము దేశీయులకు వినియోగించిన వీరేశలింగసుకవీ, నీవు జన్మించుటఁజేసి తెలుఁగు దేశము భాగ్యమే భాగ్యము. నీశిష్యులుగ - నీమిత్త్రులుగ - నీయాప్తులుగ - కాదు, కాదు- నీకు సమకాలికులుగ నున్నవారి పుణ్యమే పుణ్యము. స్వార్థత్యాగి వగు నీకు, విద్యాధికుఁడవగు నీకు, కవివరుఁడ వగునీకు, నీతి - మత - సాంఘిక - సారస్వత - రాజకీయాది విషయము లన్నింటను జవిచూచిన తెలుఁగుసీమ యంతయుఁ గృతజ్ఞత చూపుచు కృతార్థత చెందుచున్నది.

తాతా ముద్రాక్షరశాల, నిడుబ్రోలు
ముద్రితము 1—12—1935.

# వెలకు సిద్ధములగు గ్రంథములు.

## ౧ వైదిక వాఙ్మయ చరిత్రము

ఇది వేదములను, బ్రాహ్మణములను, అరణ్యకములను, ఉపనిషత్తులను, సూత్రగ్రంథములను గూర్చి విమర్శించిన గొప్ప గ్రంథము. సమున్నత దశలో నున్న ఆనాటి భారతీయుల విజ్ఞానప్రాభవము పాశ్చాత్యులు కొండాడినతీరు ఇందు తెల్లమగును. విద్వచ్ఛిరోమణి [illegible] పాఠ్యగ్రంథముగా నుపకరించునది. లైబ్రరీబుక్కుగా (అపూర్వ [illegible] నది. తొమ్మిది అధ్యాయములు. దరిదాపు ఐదువందల పుటలు.

వెల రెండున్నర మాత్రము.

## ౨ కామశాస్త్రము

ఇది - తృతీయపురుషార్థమును గూరిచి సర్వతోముఖముగఁ జర్చించిన వాత్స్యాయన సూత్రములకుఁ దేటతెల్లమగు తెలుఁగుసేఁత. వాత్స్యాయనసూత్రములు, జర్మని - హిందీ - బెంగాలి - ఇంగ్లీషు మున్నగు భాషలలోఁ బరివర్తింపఁబడి వేలకువేలు ప్రతులు ప్రపంచవ్యాప్తమగుటయే దీని యౌత్కృష్ట్యమును సూచించుచున్నది. కామశబ్దశ్రవణమాత్రానఁ గలవరపడని ఆరోగ్యులగు పాఠకులకు మాత్రమె యియ్యది పఠింపఁదగియున్నది. ఆపాతతః చదివి ఆవలఁ బెట్టవలసినతీరులో - ఇయ్యది నిబద్ధము కాలేదు. ఏడు అధ్యాయములు. ముచ్చట నిచ్చునచ్చు. శైలి లలితము. విషయము అమూల్యము.

వెల ఒక్క రూపాయి.

## ౩ ధర్మశాస్త్రము

సర్వవిధములగు విధులు సమగ్రముగఁ జర్చింపఁబడ్డ ప్రామాణికమగు ప్రాచీనస్మృతి. మను మహర్షి ప్రోక్తమగు నిందలి విషయములను ఖండనమునకైన, మండనమునకైన అక్షరాస్యులగువారెల్లరు సద్యః [illegible] చేయఁదగును. అస్పృశ్యత - ఆహారాది విషయములందు కలవరపాటు చెందిన అధునాతన లోకము ముఖ్యముగఁ గాంచఁదగును. ఆదర్శభూత [illegible] అర్వాచీనుల యభిప్రాయములను ఆధారముగాఁ గొని అభివర్ణించిన [illegible] మగు పీఠిక కలదు. సర్వాంగ సుందరమగు ముద్రణావిధానము.

వెల రెండు రూపాయలు.

౭. నీతి సప్తతి

ఉచితమగురీతిని హృద్యములగు ఉపదేశములను ఉపదేశించు గ్రంథము. పద్యములు సరసములు. విశిష్య - బాలికల కత్యంతోపయుక్తము. 'టెక్స్టు బుక్కు' గా 'అప్రూవ్' అయినది.

వెల రెండణాలు.

౫. కథా వింశతి

ఇరువది కథలు. నీతి - లోకతంత్రము - విద్యాభిలాషము - వినయప్రవర్తనము లోనగు సుగుణములను సులభముగ బోధపఱుపఁజాలు కథలు. ప్రారంభవిద్యాభిలాషులకు అత్యంతము ఉపకరించునది. 'టెక్స్టు బుక్కు'గా, 'అప్రూవ్' అయినది.

వెల అయిదణాలు.

౬. సుభాషితము

సంస్కృతవాఙ్మయ మహోదధినుండి యేర్చికూర్చిన నీతిరత్నములు. సర్వకాలము సర్వమానవు లాదరింప ననువగు నీతివాక్యములెల్ల యిందుఁ గలవు. సరసమగు వచనరచన.

వెల నాలుగణాలు.

౭. కావ్యమాల

(రెండు భాగములు)

ప్రాచీనార్వాచీనములగు నాంధ్రగ్రంథములనుండి యేర్చి, కూర్చిన సరసములగు గద్యపద్యముల సంపుటి. 'టెక్స్టు బుక్కు' గా 'అప్రూవ్' అయినది.

ఒక్కొక్కటియు పంౘెండణాలు.

ఇవి కావలసినవారు :—

మేనేజరు,

భాషాపోషక గ్రంథమండలి,

అమృతలూరు, గుంటూరు జిల్లా.

— రాఁబోవు గ్రంథములు —

విక్రమాదిత్యుఁడు

వరరుచి

తేట తెలుఁగువచనరచనము.